



వదిక్ ఆరేళ్ల కుర్రాడు. సోవియట్ యూనియన్ రాజధాని మాస్కోలో వుంటాడు. యేమిటేమిటో తెలుసుకోవాలనే కుతూహలం వాడికి చాలా యెక్కువ. తెలుసుకునే దాకా నిద్రపోడు. అమ్మతోనూ, నాన్నతోనూ కలిసి నగరంలో తిరగడం, పల్లెటూళ్లకి షికారు పోవడం వాడికి యిష్టం. వాడికి అలా షికార్లు వెళ్లడం అన్నిటి కంటే కూడా, నోరూరించే ఐస్‌క్రీమ్ కంటే కూడా యెంతో యిష్టం. వాడడిగే యక్ష ప్రశ్నలకి యెవళ్లకేనా విసుగొచ్చేస్తుందని వాళ్ల నాన్న వేళాకోళంగా అంటూ వుంటాడు.





ఓ రోజున వాళ్ల నాన్న పనయాక యింటికి తిరిగి వచ్చేడు.

‘‘ఒరేయ్, వదిక్! రేపు నాకు సెలవు. యేం, నువ్వు నేమా బొటానికల్ గార్డెన్స్ చూడ్డానికి వెడదాం. చాలా సరదాగా వుంటుంది. భలేభలే చెట్లు, పువ్వులు, పొదలు వుంటాయి. యెన్ని రకాల పక్షులో వుంటాయి. నెమళ్లు, పెద్ద బాతులు, హంసలు, పొట్టి బాతులు....’’

‘‘ఉడతలో మరి?’’ అని వదిక్ వాటిని కూడా చూడచ్చునే ఆశతో అడిగేడు. బతికున్న ఉడతని చూడాలని వాడికి యెంతో కోరికగా వుంది.

‘‘ఆఁ, అవీ వుంటాయ్. వాటినీ చూద్దువుగాని. అవి యెంతో మచ్చికగా వుంటాయి. యిలా చూడు...’’ అంటూ ఉబ్బి యెత్తుగా వున్న చొక్కా జేబుకేసి సైగ చేస్తూ నాన్న తల వూపేడు. వదిక్ జేబులో యేముందో నని తొంగి చూశేడు. నాన్న జేబునిండా హేజెల్ కాయలు వున్నాయి. ఉడతలకి యిష్టమైన చిరు తిండి అవి.



మాస్కోలో అద్భుతమైన ప్రకృతి సంపద వుంది. సెంట్రల్ బొటానికల్ గార్డెన్స్ విశాలంగా విస్తరించుకుని వుంటాయి. చుట్టూతా కాపరాలుండే బోలెడేసి అంతస్తుల భవనాలుంటాయి. వాటి మధ్య యీ బొటానికల్ గార్డెన్స్ ఆకుపచ్చ ద్వీపంలాగా వుంటాయి. వాటి వైశాల్యంలో వో మాదిరి పట్టణాన్ని సునాయాసంగా యేర్పాటు చెయ్యొచ్చు. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలనుంచీ మొక్కల్ని యేరి యిక్కడికి తీసుకొచ్చేరు. దక్షిణాది ఉష్ణ ప్రాంతానికి చెందిన సైప్రస్ (తమాల వృక్షంలాంటిది), పామ్ (తాటి చెట్టులాంటిది), వృక్షాలు సుదూర ఉత్తరాదికి చెందిన మాస్ (వొక విధమైన పాచి), లిచెన్ (పాకుడు జాతి మొక్క) పక్కనే వుంటాయి. మాస్కో ఫర్ చెట్లు దక్షిణ అమెరికా పైన్ పక్కనే దివ్యంగా బతుకుతాయి. పచ్చిక మైదానాలు, పుష్ప శయ్యలు, పువ్వుల మళ్ళ వసంత రుతువునుంచి ఆకురాలు కాలందాకా ధగధగ మెరిసిపోయే రంగులతో వుంటాయి. ప్రకృతి సృష్టించిన మొక్కల రకాలేకాక శాస్త్రజ్ఞులే దోహదం చేసి పెంచిన మొక్కల రకాలూ యిక్కడ వున్నాయి.











యీ బొటానికల్ గార్డెన్స్ యెంతో విశాలమైనవి. శోభాయమానంగా వుంటాయి. ఒక్క రోజులో మొత్తం వాటిని చూడడం అవదు. యీ గార్డెన్స్ చూడవచ్చే వాళ్లకి సౌకర్యంగా వుండేందుకు ముఖ్యమైన రాస్తాల్లో తలుపులులేని బస్‌లు నడుస్తూ వుంటాయి. వాటికి రెండేసి మూడేసి కోచీలు వుంటాయి. అందులో యెక్కి కూర్చుంటే సినిమా తెరమీద దృశ్యాల్లాగా రంగురంగుల ప్రకృతి దృశ్యాలు మీకు కనిపిస్తూ వుంటాయి. ఓక్ చెట్లు, బర్చ్ తోపులు, కొలనులు, బ్రహ్మాండమైన పుష్ప శయ్యలు, సైబీరియన్ ఫర్ చెట్లు, సిల్వర్ ఫర్ చెట్లు, లార్చ్ చెట్లు (దీన్ని బొబ్బిలి చెట్టు అనవచ్చు), పళ్ల తోటలు, కూరగాయల మళ్లు, బెర్రీ తోటలు బస్సు వెడుతూ వుంటే పక్కనుంచి జారిపోతూ వుంటాయి. వీటిని ఆవరించుకుని అడివి వుంది. ప్రపంచం నలుమూలలనుంచి సేకరించి తెచ్చిన అనేక వేల రకాల చెట్లు అక్కడ వున్నాయి.









నాన్న సెలవు రోజున వాళ్లకి అదృష్టం బాగానే కలిసొచ్చింది. పొద్దుటినుంచీ చక్కటి యెండ కాస్తూనే వుంది. ఆకాశంలో పిసరు మబ్బుతునక కూడా కనిపించలేదు. యెలా చూసినా తేటగా, వెచ్చగా వుండేటట్టే కలిపించింది. గబగబా టిఫిన్ తినేసి, అమ్మ యెత్తి పొడుపులు వింటూ, వదిక్, వాళ్ల నాన్నా మెట్రో స్టేషన్‌కి బయల్దేరారు. నలభై నిముషాల్లో బొటానికల్ గార్డెన్స్ గేటు దాటి లోపలకి వెళ్లారు.

బస్ గేటు దగ్గరే వుంది. డ్రైవర్ యింక బయల్దేర బోతున్నాడు, అప్పుడు వీళ్లని చూశేడు. గబగబా రండన్నట్టు వాళ్లని చూసి చెయ్యి వూపేడు. వదిక్, వాళ్ల నాన్న యెక్కగానే బస్ బయల్దేరింది. మలుపుల్లో హుషారుగా కూతవేస్తూ సాగింది.





రాస్తాకి అటూ యిటూ పొడుగాటి చెట్లు వున్నాయి. దట్టమైన అడివి వుంది.

''అరె, యిది అచ్చుగా అడివే నాన్నా'' అని వదిక్ ఆశ్చర్యంగా అరిచాడు.







"అచ్చమైన అడివి లాంటిదే మరి. యిక్కడ బెర్రీలున్నాయి, పుట్టగొడుగులున్నాయి. వసంత రుతువులో యిక్కడి డొంకల్లో లోయలో పూచే లిలీ పువ్వులు పూస్తాయి. మరొకందుకు కూడా యిది సాటిలేని అడివి అని చెప్పాలి. అవిగో ఆ ఓక్ చెట్లు చూశావా? మాస్కో చుట్టు పక్కల యిప్పుడు అట్టే ఓక్ చెట్ల తోపులు లేవు. ఆ వున్న కాసిని తోపుల్లోనూ వొకటి యీ బొటానికల్ గార్డెన్స్‌లో వుంది. యీ తోపు వంద యేళ్ళ పైబడి నటువంటింది. బ్రహ్మాండమైన కొన్ని చెట్లయితే రెండు వందల యేళ్ల వయసువి కూడా. చూడు యెంత అందమైన ఓక్ చెట్టు వుందో అక్కడ!"



“యీ బర్చ్ చెట్ల తోపు, మరి? యిదీ ప్రత్యేకమైందేనా?”

“అవును మరి! యీ గార్డెన్స్‌లో చాలా రకాల బర్చ్ చెట్లు వున్నాయి. అన్ని బర్చ్‌లూ ఒక్కలాగే వున్నట్లు కనిపిస్తాయి. కొంచెం జాగ్రత్తగా చూస్తే గనక వెంటనే నీకు తేడా తెలుస్తుంది.”

“బాగా తేడాగా వున్నాయి” అని వదిక్ ఒప్పుకున్నాడు. “యీ బర్చ్ చెట్ల కాండాలు లేత రంగులో వుంటే అక్కడివి ముదురు రంగులో వున్నాయి. దాదాపు యెండిన ఆకు రంగులో వున్నాయి.”











బస్ ఆగింది. హఠాత్తుగా అడివిలోనుంచి కూ మంటూ శోక స్వరం విని
పించింది.

''ఉడతా అది?'' అని వదిక్ మెల్లిగా అడిగాడు.

''కాదు బాబూ, నెమలి. పద, వెళ్లి చూద్దాం.''

వాళ్లు బస్ దిగి చెట్ల మధ్య నడుచుకుంటూ పక్షులు వున్న చోటికి వెళ్లారు. పెద్ద పెట్టున కూతలు వాళ్లకి వినిపించాయి. నెమళ్లు గుంపుగా అక్కడ వున్నాయి.



‘‘అందమైన యీ పక్షులు భారత దేశానివి’’ అని నాన్న చెప్పాడు.

అందమైన మగ నెమళ్లని బూడిద రంగు ఆడ నెమళ్లని వదిక్ దగ్గర కంటా వెళ్లి చూశాడు.









''అవి యెందుకంత విచారంగా కూస్తున్నాయి?'' అని వదిక్ అడిగేడు. వాళ్ల నాన్న కొంచెం తికమక పడ్డాడు. ఆయన యింకా యే మాటా జవాబు చెప్పక ముందే వదిక్ తనే సమాధానం చెప్పుకున్నాడు, ''బహుశా యింటి బెంగతో వున్నాయేమో'' అని.

''కావచ్చు. అవి స్వస్థలంలో వున్నా యిలానే కీచుమని అరుస్తాయి. ముఖ్యంగా యే పామునేనా పట్టుకుంటే. నెమళ్లకి పాములంటే భయం లేదు. వాటిన్ని తింటాయి కూడా.''

నెమళ్లని చూశాక వదిక్, వాళ్ల నాన్న గార్డెన్స్ మధ్యకి వెళ్లారు. ఆస్ఫాల్ట్ రోడ్డు మలుపు తిరగ్గానే వాళ్లకి వరసగా కొలనులు కనిపించాయి. ఆ కొలనుల్లో పెద్ద బాతులు, పొట్టి బాతులు, గర్వంగా అందంగా కనిపించే హంసలు వున్నాయి.

వదిక్ సంతోషం పట్టలేకపోయాడు. యెందుకేనా వుంటుందని జేబులో దాచుకున్న రొట్టె ముక్కని యివతలికి తీశాడు. దాన్ని చిదిపి చిన్న చిన్న తునకల్ని నీళ్లల్లోకి విసరడం మొదలెట్టాడు.

వాణ్ణి అక్కడనుంచి తీసి కెళ్లడానికి వాళ్ల నాన్న యిక నడు పోదాం మరి అని చెప్పి చాలా బతిమాలాల్సి వచ్చింది.

వాళ్ల మళ్లీ బస్ యెక్కి యెదరకి వెళ్లారు.





బొటానికల్ గార్డెన్స్‌లో వృక్ష వనం గుండా వున్న రస్తామీద ఆ బస్ వెళ్లింది.

అనేక దేశాలనుంచి యిక్కడికి తీసుకువొచ్చిన ఫర్, లార్చ్, మేపిల్, చెస్ట్ నట్ యింకా యితర చెట్లూ గుంపుగా బొమ్మల్లో గీసినట్టు అందంగా వున్నాయి. విశాలమైన అడివి బయలులో యెండలో శోభగా వున్నాయి. ఉత్తర అమెరికా ఖండంనుంచి తెచ్చిన ఇండియన్ బీన్ చెట్లు మరీ ఆకర్షవంతంగా కనిపించేయి. మినమిన లాడే తెల్లని పువ్వులు విండుగా వికసించాయి. యివన్నీ ముదురాకు పచ్చ నేపధ్యంలో దివ్యంగా కనిపించాయి.

"యివి ఉపయోగపడే చెట్లేనా?" అని వదిక్ అడిగేడు.

"మామూలుగా అంటావ్! చాలా ఉపయోగం. కొన్ని చెట్ల మందులు తయారు చెయ్యడానికి పని కొస్తాయి. కొన్ని చెట్లు కాగితం తయారీకీ, యితర ఉత్పత్తులకీ పని కొస్తాయి. మరికొన్ని తోటలో అందంగా వుండే రకాలు. పైగా మొక్కల్లో ఉపయోగపడే ధర్మాలు యేమేం వున్నాయో శాస్త్రజ్ఞులు యెప్పుడూ కొత్తగా కనిపెడుతూనే వున్నారు."





వదిక్ వింతగా చుట్టూతా చూశాడు. వాడికి వున్నట్టుండి బాగా తెలిసిన ఓ తోపుడు బండి కనిపించింది. నోరూరించే ఐస్‌క్రీం బొమ్మ వున్న తోపుడు బండి. వాడు బస్ గుమ్మం దగ్గరికి తకామని వెళ్లాడు. ఆ క్షణంలో బస్సు ఆగింది. వదిక్ రాస్తామీదకి వురికేడు. వాడి వెనక్కాలే వాళ్ల నాన్నా వురికేడు. సంగతి యేమిటో తెలీక ఆయన చాలా కలవర పడిపోయేడు. కొడుకు కళ్లల్లోకి చూసేడు. వాడి మౌన అభ్యర్ధన కనిపించింది. వెంటనే అంతా అర్థమైంది.

"కొంచెం మళ్లీ శక్తి పుంజుకునే వేళ అయిందనేనా నీ ఉద్దేశం? సరే, అయితే, ఐస్‌క్రీం అందుకు పనికొస్తుంది" అన్నాడు.

ఐస్‌క్రీం కొనుక్కున్నాక తండ్రీ, కొడుకూ యిద్దరూ మెల్లిగా రాస్తామీద యెదరికి వెళ్లేరు.







"నిత్యం పువ్వులు వికసించే తోట" అని పిలిచే తావు గుండా వాళ్లు నడిచివెళ్లారు. అక్కడ మొగ్గలు తొడిగే పొదలు, నిత్య హరిత గరికలు అన్నీ కలిసిపోయి వుంటాయి. భిన్న భిన్న రకాల పువ్వులు వికసిస్తూ వుంటాయి. బొటానికల్ గార్డెన్స్ యీ భాగాలో వసంత రుతువు తొలి నాటి రోజులనుంచీ ఆకురాలు కాలం బాగా గడిచే దాకా వో మొక్క తర్వాత మరో మొక్క విడవకుండా మొగ్గ తొడుగుతూనే వుంటాయి. తేజోవంతంగా, రంగు రంగుల పువ్వుల మాలలాగా శోభాయమానంగా కనిపిస్తూ వుంటాయి.

వదిక్‌కి వొక భారీ కౌ పార్స్నిప్ మొక్క బాగా ఆశ్చర్యం కలిగించింది. అది నిటారుగా వుంది. మనిషికంటే పొడుగ్గా వుంది. దాని ఆకులు పెద్దవి. పువ్వులు గుండ్రంగా గుత్తులుగా వున్నాయి. అవీ చాలా పెద్దవిగానే వున్నాయి. వాన పడితే వదిక్, వాళ్ల నాన్న తడవకుండా వుండేందుకు వాటి కింద చేరచ్చు, అంత పెద్దవిగా వున్నాయి. కాని దాన్ని చేత్తో తాకకూడదు, యేమంటే ఆ మొక్క ఉమ్మెత్త కాయలాగా గుచ్చుకుంటుంది.

"కాని ఉడతలు యేవి? యింత సేపూ కనిపించలేదేం అవి? యిక్కణ్నుంచి యెక్కడికేనా పారిపోయాయా? ఉడత కనిపిస్తుందా, నాన్నా?" అని వాడు వాళ్ల నాన్నని అడిగేడు.

"తప్పకుండా కనిపిస్తాయి ఉడతలు" అన్నాడు వాళ్ల నాన్న.

తండ్రీ కొడుకూ మాట్లాడుకుంటూ, ఉడతలు కనిపిస్తాయో లేదోనని చూసుకుంటూ వెడుతున్నారు. ఇంతట్లోకీ వాళ్లకి శాస్త్రజ్ఞులు దోహదం చేసి పెంచిన మొక్కలు ప్రదర్శనగా కనిపించేయి. అక్కడ యింకా చాలా ఆసక్తికరమైనవీ వున్నాయి. వదిక్ వొక మెక్సికన్ అడివి టొమాటోని చూశాడు. ఆ టొమాటోలు బఠానీ గింజలంతే వున్నాయి. మానవుడు యెంపిక చేసి కృత్రిమంగా పెంచినవి అవి. యివాళ మనకి లభ్యం అవుతూ వున్న యీ రసభరిత టొమాటోలని యీ అడివి టొమాటోనుంచి తయారు చేసారని వాడు తెలుసుకున్నాడు.

వదిక్‌కి మొట్టమొదటి సారి అడివి కేబేజీ కూడా కనిపించింది. యివాళ మానవుడు రూపొందించి తయారు చేసుకున్న అనేక రకాల కేబేజీలకి మూలం యిదే. అమ్మ తనకి పెట్టే సాదా కేబేజీ యిన్ని రకాలుగా వుంటుందన్న విషయాన్ని వాడు నమ్మలేకపోయాడు మరి! ఆ వేరు వేరు రకాల కేబేజీ చూసి అసలు అవేం తరహా మొక్కలో కూడా గుర్తుపట్టడం అసాధ్యం. యీ చిత్రమైన ఆకుపచ్చ బంతి లేదా అన్యదేశీయమైన బిసగల బల్బు అసలు పుట్టుకలో వొకే కుటుంబానివని అక్కడ అతికించిన పేరుని బట్టే చెప్పగలరంతే.

''నాన్నా, ఆ వింత మొక్క యేమిటి? దానికి పైన అలా పీసాకట్టులా వుందేమిటి?''

''అది యాపిల్ చెట్టు. యివి శాస్త్రజ్ఞులు ప్రయోగం చేసే తోటలు. కొమ్మల్ని ఉత్తమమైన పద్ధతిలో యెలా యేర్పాటు చెయ్యాలో వాళ్ళు అధ్యయనం చేస్తున్నారు. బాగా దిగుబడి వుండేందుకూ, చెట్టు వృద్ధి చెంది యెక్కువ కాలం బతికేందుకూ, సునాయాసంగా పంటని యంత్రాలతో కోసేందుకూ వీలు కలిగించే రీతిని యిలా అధ్యయనం చేస్తున్నారు.... చూడు, యీ చెట్టు వో సంగీత వాయిద్యంలాగా వుంది, వీణలాగా.















“సరే, పద ఉష్ణగృహానికి వెడదాం. అద్భుతమైన పరాయి దేశాల మొక్కలు కొన్ని చూద్దాం” అన్నాడు నాన్న.

ఉష్ణగృహానికి పెద్ద పెద్ద గాజు పలకలు బిగించిన, కప్పు వుంది. అంచేత లోపలి గాలి వెచ్చ బడుతుంది. లోపల వెచ్చగా చెమ్మగా వుంటుంది. వో అమ్మాయి ఉష్ణదేశాలనుంచి తెచ్చిన కొన్ని మొక్కల గురించి చెప్తోంది. అవి మహా సున్నితమైనవి, చాలా పదునుగా చూసుకోవాలి. మితమైన వాతావరణంలో అవి ఉష్ణగృహాల్లోనే బతికి ఒట్టకడతాయి.

అక్కడ కొబ్బరి చెట్టొకటుంది. అది దాదాపు కప్పుని తాకుతోంది. వదిక్ దాన్ని చూడ్డానికి మెడ నిటారుగా చాచేడు.

“అదీ చెట్టంటే! మగాళ్ళ మాత్రమే యెక్కి కాయల్ని కొయ్యగలరు. నేను టెలివిజన్ చూశాను” అని ఆ చెట్టుని మెచ్చుకుంటూ అన్నాడు.

అప్పుడు వదిక్‌కి ‘అరటి’ అనే మాట కనిపించింది. అటు తిరిగి చూద్దుడు కదా పెద్ద చెట్టు వుంది. అది పొరలు పొరలుగా వుండే పెద్ద బోదె అనీ, తియ్యని అరటి చెట్టు వొక్కటే వొక గెల వేసి చచ్చిపోతుందనీ విని ఆశ్చర్యపోయాడు.

అరటి చెట్టు పక్కనే మరో వింత కనిపించింది. కోకో చెట్టు. దానికి కాండంమీదనే పువ్వులు పూస్తున్నాయి, కాయలు కాస్తున్నాయి.

''యిదేదో చిత్రంగా వుందే!'' అని వదిక్ ఆశ్చర్యంగా అన్నాడు.

కాని మామూలుగా వాళ్ల యిళ్లలో వుండే ఫిగ్ చెట్టు కూడా (సీమ అత్తిపండు చెట్టులాంటిది) కోకో చెట్టుకిలాగానే పువ్వులూ, కాయలూ కాండానికి పూస్తాయి, కాస్తాయి అని తెలిసింది.

ఆ అమ్మాయి కొన్ని చిత్రమైన మొక్కల గురించి చెప్తూనే వుంది: పామే గ్రనేట్ (దానిమ్మ), కాక్టస్ (నాగతాళిపాద), అరేకేరియా, బాక్స్ ట్రీ. వదిక్ వాటికేసి అలా చూస్తూనే వుండిపోయాడు. సూక్ష్మాకారంలో వున్న ఆ మొక్కలు దగ్గర దగ్గర వందేసి యేళ్ల వయసువట. చాలా మెల్లిగా యెదుగుతాయట, కాని యెన్నో యేళ్లు బతుకుతాయట.









ఆ పక్కన వున్న యింకో ఉష్ణగృహం నిండా రకరకాల ఆర్చిడ్ పువ్వుల మొక్కలే. చెప్పలేనన్ని ఆకారాల్లో, పరిమాణాల్లో వున్న పరాయి దేశాల పువ్వులు. అక్కడ నాలుగు వందల రకాలకి పై బడి ప్రదర్శనలో వున్నాయి. యీ పువ్వుల రకాలు మామూలుగా అయితే ఉష్ణ ప్రాంతాల వనాలలో మాత్రమే పెరుగుతాయి. కాని మాస్కోలో బాగానే అలవాటు పడ్డాయి. యేటి పొడుగూతా వికసిస్తాయి. ముఖ్యంగా శీతకట్టులో దివ్యంగా కనిపిస్తాయి.



వదిక్ ఆ పువ్వులు యేమిటోనని పట్టి చూశేడు. కేక్ వాసన వేస్తున్నాయి, నిజమైనవా కాదా అని నమ్మలేనంత అందంగా వున్నాయి. యెవళ్లూ చూడకుండా దొంగగా వో రేకని పట్టుకుని కూడా చూశేడు. పూలకుండీలోకి తొంగి చూశేడు. అందులో మట్టి యేమీ వున్నట్టు లేదు. ఉష్ణదేశాల యీ రకం పువ్వుల మొక్కలు చచ్చిపోయిన ఫెర్న్ మొక్కల వేళ్లలో బతుకుతాయి.













మరో చిన్న ఉష్ణగృహం వుంది. లోపల అలంకారార్థం చిన్న కొలను వొకటుంది. అక్కడ వదిక్కి మొట్టమొదటి సారిగా మాంసాహారి మొక్క కనిపించింది. ఆ మొక్క కొమ్మల నుంచి చిన్న చిన్న కొమ్మల్లా వుండే కోమలమైన "బుట్ట"లు వేలాడుతున్నాయి. యేమిటో తమాషా చూద్దాం అని యే పురుగేనా లోపలికి తొంగి చూసిందో వెంటనే ఉచ్చులో పడి పోయిందే! ఆ "బుట్ట" లోపలి గోడలకి జిగురులాంటి పదార్థం వుంటుంది. యీ పురుగు దానికి అంటుకుపోతుంది. "బుట్ట" ముడుచుకుని మూసుకుపోతుంది. ఆ మొక్క నిదానంగా తనకి దొరికిన యీ ఆహారాన్ని భోంచేస్తుంది.

ఆ కొలనుకి చుట్టూతా మిమోసా ('నన్ను ముట్టుకోకు') అనే అద్భుత రకం మొక్కలు వున్నాయి. అలా తాకితే చాలు అవి వెంటనే ముడుచుకుపోతాయి.





వదిక్ వాటి పక్కన తచ్చాడేడు. తాకగానే ప్రాణం వున్నట్టుగా కదలే ఆ మొక్కలు వాడికి నిజంగా సరదా కలిగించేయి. ఆ పక్కనే వున్న మరో ఉష్ణగృహంలోకి వెళ్లేటప్పటికి గైడ్ అమ్మాయి ప్రఖ్యాత విక్టోరియా క్రూజియా తామరాకు గురించి చెప్తోంది.

కొలనులో యీ పక్కనుంచి ఆ పక్కదాకా పెద్ద పెద్ద తామరాకులు వ్యాపించి వున్నాయి. వొక్కొక్కటీ డబ్భైయ్యేసి కిలోగ్రాముల బరువుని నిలబెట్టగలదు. విక్టోరియా పుష్పం నమ్మలేనంత అందంగా వుంది. అది చాలా పెద్ద పువ్వు. ఒకో పువ్వు అయితే వ్యాసంలో నలభై సెంటీమీటర్లు వుంది. అది వొక నెలలో తెల్లటి తెలుపు రంగునుంచి పంజకెంజాయ యెరుపు రంగుకి మారుతుంది. మాస్కోలో యీ పువ్వు చాలా యెండకాసేటప్పుడు మాత్రమే వికసిస్తుంది.

బ్రహ్మాండమైన ఆ తామరాకుల్ని చూసి వదిక్ నోరు వెళ్లబెట్టి నుంచుండి పోయాడు.

“అబ్బ! యెంత పెద్ద ఆకు! చిన్న తెప్పలాగా వుంది. దానిమీద కూర్చోవచ్చు. కాని మనిద్దర్నీ ఆపుతుందా, నాన్నా?” అని సంభ్రమంగా గొణిగేడు వాడు.

వాళ్ల నాన్న చిన్నగా నవ్వేడు.

“వుహుం, ఆపలేదేమో మరి. కాని నువ్వొక్కడివీ దానిమీద కూర్చుని తోసుకోవచ్చు.”

















వదిక్, వాళ్ల నాన్నా చాలా సంతృప్తిగా ఉష్ణగృహంనుంచి యివతలికి వచ్చేరు.

“అదుగో అక్కడ ఆ గడ్డమీద వున్న తివాసీ యేమిటి, నాన్నా?”



















''యే తివాసీ?'' అని వాళ్ల నాన్న అర్థంకాక కుర్రాడు చూపించిన వేపు చూశాడు. ''అది తివాసీ కాదు, పువ్వులు'' అన్నాడు. ''ఇంకొంచెం దగ్గరగా వెళ్లి చూద్దాం. పియోనీ పువ్వులు బాగా వికసించేయి. అవి యెంతో అందమైన పువ్వులు. ఆ పచ్చిక మైదానంమీద వున్న చిన్న పువ్వులు చూశావా. నువ్వు వాటిని తివాసీ అనుకుని పొరపడ్డావు. దూరంనుంచి చూస్తే అవన్నీ తివాసీలాగా కనిపించాయి.''















ఓ నెల రోజుల్లో గ్లాడియోలి (పొడుగాటి కాడకిపైన పూసే పువ్వులు) యీ పచ్చిక మైదానంమీద పూస్తాయి. వాటి ఆకు పచ్చ కాడలు కనిపిస్తాయి. రకరకాల గ్లాడియోలి పువ్వులు విరిసి యెలాంటి ఇంద్రధనుస్సు రంగులు విరజిమ్ముతాయో నువ్వు వూహించ లేవు. పువ్వులని దోహదం చేసేవాళ్లు చాలా మంది కొత్త రకాల గ్లాడియోలి పువ్వుల్ని సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారు.









''ఇవి పాపీ మొక్కలు (గసగసాల జాతి మొక్కలు) కదూ?'' అని వదిక్ సంతోషంగా అన్నాడు.

కంటికి నదురుగా కనిపించే యెఱ్ఱ పాపీలు నాజూకైన చిన్న కాండాలమీద పిల్లగాలికి అటూ యిటూ వూగేయి.

''నీకు పాపీల పాట వినాలని వుంటే వాటి దగ్గర కంటూ వొంగి విను'' అని నాన్న చెప్పాడు.

వదిక్ బదులు చెప్పకుండా మోకాళ్లమీద వాలేడు. పువ్వుల దగ్గర కంటూ వొంగేడు. తర్వాత కొంచెంగా పల్లికిలించేడు.

''మనం ఉడతల గురించి అసలు మర్చేపోయామని పాపీలు నాకు పాట పాడి చెప్పాయి'' అన్నాడు.









నాన్న ఫక్కున నవ్వేడు.

"ఆ పువ్వులకి నమ్మలేనంత గ్రహణ శక్తి వున్నట్టుంది. వూఁ, సరే, వెళ్ళి ఉడ తలని చూద్దాం పద. అవి యిక ఆట్టే దూరంలో వున్నట్టు లేవు" అన్నాడు.

వదిక్, వాళ్ల నాన్న ఆస్ఫాల్ట్ దారి దాటి కొన్ని గజాలు నడిచారు. మళ్లీ చుట్టూతా పువ్వులు కనిపించాయి. అది గులాబీల తోట. బొటానికల్ గార్డెన్స్‌కి గర్వమూ సంతోష కారకమూ ఆ తోట. లెక్క లేనన్ని రకాల గులబీలు అక్కడ వసంతరుతువు నాటి నుంచీ ఆకురాలు కాలం దాకా పూస్తూనే వుంటాయి. వొక రకం గులాబీలకి "మాస్కో ప్రత్యూషం" అని పేరు.





















వదిక్ యీ సౌందర్యాన్నంతట్నీ యేదో తెలిసిన వాడిలాగా తేరిపార చూశాడు.

“మనం అమ్మని యిక్కడికి తీసుకురావాలి. యివి అమ్మకి యిష్టమైన పువ్వులు. మనం అందరం కలిసి మళ్లీ నీకు సెలవు వుండే రోజున బొటానికల్ గార్డెన్స్‌కి రావచ్చా?” అని అడిగాడు.











‘‘తప్పకుండా వద్దాం. నీకు యివాళ మనం యిక్కడికి రావడం బాగా నచ్చింది. పద, ఉడతల్ని చూద్దాం మరి. చూశావా, చెట్లమీద గింజలు పెట్టిన గూళ్ళు వేలాడగట్టేరు. వాటిని పక్షుల కోసమూ, ఉడతల కోసమూ అలా వేలాడగట్టేరు తెలుసా?’’

వాళ్ళు కొన్ని అడుగులు వేశారో లేదో వున్నట్టుంది. వో ఉడత చెట్లలోనుంచి యివతలికి దూకింది. అది వెనక్కాల కాళ్లమీద కూర్చుని యీ వచ్చిన వాళ్లెవరా అని పరిశీలించడం మొదలుపెట్టింది.

దాని వెనక్కాలే యింకో రెండు ఉడతలు యెగురుకుంటూ వచ్చేయి.

"హమ్మయ్య, నీ ఉడతలు ఆఖరికి వచ్చేయి. ఫరవాలేదు, భయపడకు. అవేమీ చెయ్యవు, చాలా మంచివి. నీ చెయ్యి కొరకవు అవి, జాగ్రత్తగా నీ చేతిలోనుంచి కొంచెం కొంచెం కాయలు తీసుకుంటాయి. కాసిని హేజెల్ కాయలు వాటికియ్యి" అంటూ నాన్న వదిక్ చేతిలో వో గుప్పెడు కాయలు పోశాడు.

వదిక్ చతికిల పడి కూర్చుని చెయ్యి చాచి అరచెయ్యి తెరిచాడు....







